# రిజష్టరీపెళ్లాం!

రచయిత:

శ్రీయాళ్ల బట్లబాబు



ప్రకాశకులు:

కందులగోవిందం

జనరల్ బుక్ డిపో; అండ్ పబ్లిషర్,

రాజమండ్రి.

1946

Paper Supplied by Party Q. H. E. G. 59.



[వెల రు. 0—8—0,

# సూచన

ధర్మసమాజం ధర్మకర్తలు సంఘపెద్దలు వారా? వారా? నీతిదూరులు? అవివేకులు? కాసుకక్కుర్తి-మలినజీవితం—అగచాట్లజీవితం–చేతులారాతమహృదయపూర్వకంగా అగ్నిసాక్షిగా కరుకుటాత్మతో న్యాయవాటికా గర్భస్థానంలో వారే అబద్ధం అసత్యం ఆడింది-చెప్పింది?

"నాన్నా నీకు — నీచిత్రవిచిత్రజీవితసరళికి నీజీవిత మలినానికి"

—శ్రీ యా. జ

---

శ్రీరామ ప్రెస్, రాజమండ్రి.

౧

నమస్కార్.

నాన్నా! నాన్నా! నాన్నా!

ఆపదమే నాజీవితంలో కొఅతయ్యింది.

ఫ్రస్ట్రేను—అమ్మచేతుల్లో పెటిగి పెద్దాణ్ణయ్యేను.

చిన్నప్పుడు నాతో ఆడుకునే పిల్లలు "నాన్నా—నాన్నా" అనుకుంటూ, దూరంలోంచివచ్చే తండ్రులప, ఎదురుగావెళ్ళి ఆప్యాయంతోటి వాళ్ళందించే మిఠాయీ పళ్ళూ అందుకొని, ఆనందాలుమూటగట్టే పలుకులుచెబుతూ, తండ్రిచంకలో తలవాల్చే రోజుల్నిచూచేను.

మరి నాకటువంటి వేమీలేవు.

'నాన్న' నాకుఅమ్మే!

జీవితమంతా అమ్మేనేమో!

అల్లా పిల్లలు తండ్రులపాత్రుపు పొందుతుంటే, నేనుచేసేది ఏముంది. ఆవేదనతోటి—తెలీనిపత్రికృతితోటి, వాళ్ళవంక చూచేవాణ్ణి.

అంతకంటే ఏంచేస్తాను?

తప్పితే ఒకటి.

పిల్లలతోపాటు, నేకూడా వాళ్ళుపిలుస్తుంటే 'నాన్నా' అనేవాణ్ణి వాళ్ళతండ్రుల్ని.

ఏంచేయనుమరి? నాన్నలేడు.

లేదు. నిజానికి నాతండ్రిఅనేవాడు యిప్పటివరకూ యీక్షణంవరకూ మాఊళ్ళోనే జీవాలతోనే ఉన్నాడు.

ఉండిమాత్రం ప్రయోజనమేమిటి?

నేను తండ్రిని కలిగివుండీకూడా, తండ్రిలేనివాణ్ణి అయ్యేను.

గంలోకంచాత అట్లాపిలవబడుతున్నాను కూడాను.

కారణం కారణం?

చాలాలోతయ్యింది—బరువయ్యింది—ఎత్తయింది.

వినండి!

అమ్మ తప్పుచేసిందుటలాండి, ఆతప్పుకీ దోషానికీ, అమ్మను కొట్టేడు—తిట్టేడు—బాధించేడు, అందకు అమ్మ ఓర్వలేకపోయ్యింది—భరించలేక పొయ్యింది.

ఏం చేస్తుంది?

ఆనరకకూపాన్ని భరించి, ఆయింట్లో నిల్చుతుందా?

నిల్వలేదు.

కష్టం—మహాకష్టం!

నాజీవితంలో—ఆమ్మ రక్తమాంసాలుఇమిడిఉన్నై. పొద్దల్లా, చెమటోడ్చి, ఎముకల్ని ముక్కలుచేసుకొని నన్ను పొడిగించిన మాతృదేవత, ఆతల్లిఋణాన్ని నాజీవితంలో తీర్చకల్గుతానో లేదో!

నేనప్పుడే బడిలోంచివచ్చి—

'అమ్మా! బువ్వ!' అన్నాను.

మొదటిలోనన్ను చూడ్లా.

కాని నామాటలు చూపించేయినన్ను.

అప్పుడు, ఆప్రికృతిలో, ఆసమయాంలో తీరని అపచారాన్ని అమ్మకు కల్గించినవాణ్ణి అయ్యేను. ఇది యీమాట యీనాడే తెల్సుకోగలిగేను.

ఎందుచాతంటే—

మాష్టారునాకు సంతోషవార్త చెప్పేరు. అందుగ్గా పెద్దయిన సంతోషంతో—అమ్మ తినిపించె బువ్వనుతింటూ, ఆసంతోషాన్ని చెబుదామీ అనుకున్నా.

కానీ అమ్మ పరిస్థితినిచూచేను. నిర్ఘాంతపోయాను. స్థంబించిపోయేను,

ఏం చెప్పనిక?

మబ్బుమూట చిల్లుపడి వర్షంకురుస్తోన్నట్టు, మాయమ్మ తెల్ల తెల్లటి నేత్రాల్లోంచి సంతతధారాపాతంగ రాలిపోతుందినీరు, కన్నీరు కన్నతల్లి కన్నీరు.

అనుకున్నాను 'అమ్మనేత్రాలు—నీరునంచి చిల్లుపడిందేమో' అని

వాడిపోయినముఖంమీదుంచి ఎఱ్ఱటినీరు జాలువారుతూంది. యీసారి నాగుండెపగిలిపోయినట్టయ్యింది. అంటే మీకు ఆశ్చర్యాల్సంటుంది.

అనుకున్నాను—'అమ్మముఖంలోంచి వెచ్చటి నెత్తురుకాబోలు చిమ్ముతోంది' అని

కాదు. దీర్ఘంగాచూచేను.

తలలోంచి మెఱుస్తో కారుతోన్న తెల్లటి చెమటనీరు—బిందువులు—కణాలు, అమ్మవిశాల ఫాలభాగంమీద తళతళ మెఱిస్తోన్న కుంకుమపువ్వును, కలిపుకొని, రక్తకాల్వ—చిన్నటలాగు చెక్కిళ్ళంట జాలువార్తోంది.

ఎప్పటినుంచి దుఃఖస్తువుందో నేను చూసేసరికి, నేలమీదపడి యింకిపోయిన కంటినీరు—క్రింద చాలాభాగం తడిపెడుతోంది.

నేను ఎంతయితే సంతోషంతోవొచ్చేనో, అంతా నశించి పోయింది, నాహృదయకుసుమం వాడిపోయింది— రాలిపోయింది నా బుల్లిఅంతరాత్మకు, లేతహృదయానికి ఎన్నెన్నో మిట్టపల్లాలు, ఆనంద సాంద్రింలో ఏర్పడినవి.

గద్గదస్వరంతో

దుఃఖశ్రావ్యాన్ని అదిమపట్టుకుంటున్న కంఠంతో—

'అమ్మా... వొచ్చేను... బరినుంచి...'

అని యింకా యింకా, యేమేమో చెబదామనుకున్నా గానీ అమ్మస్థితిని చూడసాగేను.

నామాట వినంగనే,

నే చూడలేదని కాబోలు—

కళ్ళనుంచి ముఖంగుండా ప్రవహిస్తోన్న, వేడినీటిని, స్వేదకణా లని మబ్బుపర్చుతోంది, తుడ్చుకుంటోంది

తనమాఝ్నచూసి బేజారయ్యిపోతా అనికాబోలు, ఆమె వాతావరణాన్ని నాకు తెలీకుండా, తెలిసినా, అర్థంగానట్టు నటించబోయింది—నటించింది.

నే తెలుసుకున్నా,

ఆమె చింతా, విచారం నేనగపడ్తున్నాలేకే, నేనెక్కడబాధ పడతానని, అందుచాతనే నాకు తప్పించాలనుకుంది

అటువంటపుడు, నేనుమాత్రం కారణాన్ని గురించి దేనికి నిర్బంధించడం, అడగడం?

నేనుకూడా మాట్లాడ్లా!

అసలు, అమ్మ వెనుకటిస్థితిని, పరిస్థితినిచూడ్లేనట్టుగా, తెలీనట్టుగానే నటించేను.

మరి తల్లికి బాధకలిగించేది ఎందుకని.

ప్రత్యేకంగా అమ్మగురించే సంతోషం తెచ్చుకొని,

కనుల్లో ఆనందాన్ని వెదజల్లుతూ

హృదయంలో అశాంతి గుప్తపర్చుకుంటూ

"అమ్మా అమ్మా" అంటూ నాచిన్ననడకలతోనే—చిన్నకృష్ణుడిలా వెళ్ళేను—అప్యాయంగాఅందుకుంది. చేరదీసి— కోమలహస్తాలతో ఎత్తుకొని ఆవేదనగా హృదయాని కత్తుకుంటూ ముద్దులు పెట్టుకుంది.

ఆముద్దులు రోజూ పెట్టుకుంటోన్నవాటిమల్లే లేవు.

వలిగిపోయిన గొప్పపువ్వును, తృప్తికోసరమని, అసంతృప్తితో ఆస్వాదించే కళావ్యక్తిలాగు—

అమ్మ నన్ను పెట్టుకొన్న ముద్దుల్లో—వెతుకుండే తియ్యదనం, ఏదో ఆనందం పుతుడ్లా.

చెబుతున్నాను ఎరువు సంతోషంతోనే—

“అమ్మా! నేను, నేను.” మరోతరగతిలోకి వెళుతున్నా—ఇంత వరకూ నేలమీదే కూచోబెట్టారు—కూచోవాల్సింది. ఇపుడు మాష్టారు కూర్చునేబల్ల మల్లెంగనే, నేనుపోయే తరగతిలోవుంటుంది' అన్నా ముద్దులొలికే చిన్నఅందాలతో,

మరిఅమ్మకు సంతోషమివ్వాలిగామా? అందుకు.

ఆతృతగా—

అపుడే వొచ్చిన ఆనందసిక్తలా—నాలోకిచూస్తూ—

'ఏంబాబూ! పంతులుగారు చెప్పేరా—?'

'ఊఁ! నీవు నాల్గోక్లాసు పాసయ్యేవోచ్ భానూ! అన్నారు.'

'నిజం—బాబూ—' అర్ధోక్తిలో చెప్పింది.

అప్రయత్నంగా తల్లిముఖంలోకి చూచేను.

ఏవోమాటల్ని వింటున్నట్టుగ్రహించేను. అమ్మవినేవాటిని నేకూడా వినాలని—నాలోతచెవినొకటి అటుకేంద్రీకరించాను అమ్మకు సరియైనసలహాలు నటిస్తాను

'నాన్నా! నేను పాసయ్యేను కొత్తబట్టలూ—మిఠాయిలూ—పళ్ళూ కొనిపెట్టవుమరి?' అని ప్రశ్నగుమ్మంలోకి వినిపించేను. కొడుకిమాట్లకి ఆతండ్రి నూతనానందాన్ని వెల్లువరస్తూ ఆకొడుకుని ఎత్తుకొని ముద్దులు పెట్టుకుంటూ—

'రానాన్నా! ప్రతీఏడూ యిట్లానే నీవు పాసవుతుంటే రంగు రంగుల బొమ్మలూ—రంగురంగులబట్టలూ—మిఠాయిలూ—యింకాయింకా కొనిస్తా' అంటూవున్నమాటలు అమ్మతోబాటు నేకూడావిన్నాను.

చూచేను అమ్మముఖంలోకి తెలి మునితనంగా—

ఏంగోచరిస్తోంది ఆముఖంలో?

దేనిగురించో ఎదురుతెన్నులు

లక్ష్యంకావడం ఎట్లా?

బాగా–విశాలంగా నాశేతహృదయంలో–బుల్లిబుర్రలో ఆమె వంగతి గ్రహించేను.

పెద్దవైనేత్రాల్లోనికాంతులు – జ్యోతులు గృష్టిగా వెలుతురు జిమ్ముతూవున్నాయి.

బరువొందినహృదయంతో నిట్టూర్పువేడిగ

ఆనిట్టూర్పులోనే కలిసిపోయింది 'భగవాన్' అనే హీనస్వరం.

ఆస్వరం స్వాగతమిచ్చింది–ఆహ్వానమిచ్చింది. లావుపాటి అశ్రు బిందువులకు

ఆబిందువులు – అమ్మచంకలోవున్న నామీద, తొడమీద పడ్డాయి.

'అమ్మా!' అన్నఅగస్మాత్తుగ

మగి ఆకన్నీరు వేడివల్ల!

నాముఖంలో కళ్ళుపెట్టింది–చూడలేకపోయింది–ముఖం దాచుకుంది అరచేతితో. గట్టిగ గుండెలకి హత్తుకుంది. 'తనబిడ్డకు తండ్రి సౌఖ్యమనే దేమువంటిదో తెలీనందుకు' అనుకున్నాను.

అట్లానేవున్నాయి రోజులు.

'అమ్మా! మా మాష్టారు ఒకప్రశ్న వేసేరేవ్! దానికి జవాబు రేపు బడికొచ్చేటపుడు తీసుకురమ్మన్నారేవ్.'

'ఏంటిబాబూఅది?'

'ఆడవాళ్ళు బొట్టుయెందుకు పెట్టుకుంటారు? అని'

'... ... ...'

ఏంటేకారణంఅమ్మా?'

'అది మనహిందూఆచారం – సాంప్రదాయం. బొట్టనేది స్త్రీకి గొప్పధనం.'

మరి ఛాపాటంగఅడిగి తల్లిమనస్సు నొప్పింపలేనుగామరి, ఏనా నాకంతటిసాహసం?

"సీత ర్త... ఎక్కడని...?' అని అడగ్గల్నా'

దానికి ఏమిచెబుతుంది?

కన్నీరుమాత్రంగ చెబుతుంది.

జలజల రాల్చుతుంది.

అవమానం—

అభిమానం—

అనుమానం—

ఇవన్నీ వరుసగావచ్చిన పైత్యకళలేనా?

జలుబునీళ్ళు—కన్నీళ్ళుగా వస్తాయిట.

వాళ్ళమొహం!

చలచల కాగిపోతోన్న—ఉడికిపోతోన్న అమ్మ హృదయ భాండంలో చన్నీళ్లెలావుంటాయ్?

అమృతంలో—హాలాహలమా?

హిమాలయంలో—అగ్నిపర్వతమా?

ఐస్‌ఫ్రూట్‌లో... ...

అబద్ధం—అబద్ధం!

---

౨

'ఊఁ తర్వాత?''

'విను. మనఅమ్మాయికి ఎల్లారాదుమనువు...'

'అదినిజం—నిజం!'

"మరియిది మంచిసమయం, మార్తాండం తనపెళ్ళాన్ని గాలి కబురుచాత అనుమానించి. తన్ని పుట్టింటికి తోలేశాడు.'

'విన్నానది'

'నెమ్మదిగా మనఅమ్మాయిని మార్తాండానికి...'

'అది అసంభవమేమో?'

'నేనుండగా అసంభవమనేది కల్ల'

'అనుకుందాం, అంతమాత్రంలో మార్తాండం మన, సుబ్బుల్ని పెళ్ళిచేసుకుంటాడు అంటావా?'

'మార్తాండానికి, మనసుబ్బులుమీద మనస్సు వుండబట్టడం నాపూచీ...'

ఐతే నాయిబ్బందేమీలా'' అని సుబ్బులు తండ్రి అన్నాడు.

దానిని ఆమె మేనమామ తటాయించేడు వింతగా.

అమ్మ పుట్టింటివద్దనే, అమ్మతో వున్నాను చదువుకుంటూ, అమ్మ కాయకష్టం చేస్తువుంటుంది.

లేకపోతే మాజీవనం ఎట్లామరి? అంచాత.

నాన్న పవిత్రనకి; మేం ఏమాత్రంచర్య దీసుకోలా. ఎందుకు? తనకిష్టమొచ్చినదాన్ని మరొక ఆడదాన్ని పెళ్ళిచేసుకున్నాడు— వుంటున్నాడు వచ్చగా.

'ఏమండీ...?'

'... ... ...'

'మాటాడేరేం! చెవులుగాని గళ్లడినాయాఅండీ!'

అంతకీ ఉత్తరువులా.

విసగింది—

ఎఱ్ఱ తెల్లటికళ్ళలోంచి కత్తులుమాచింది—నూరింది.

అవి చూపులచింత్రింపేమో!

కాంశిల్సుశబ్దం టక్ టక్ ...

అస్త్రాన్ని ఆక్రమించుకుంది—అల్లాడుతుంది—నిల్చింది.

'ఏం మిస్సమ్మల్నిగామా గొంతంతా చించుకొని పిల్చేదీ?'

'క్షమించు...' చేతులునల్పుకుంటూ—వినయంగా—బెంకుతూ—బిక్కబడినధైర్యంతో అన్నాడునాన్న.

రోహిణీలో మేఘాలు—తునకలుఐపోయినట్టు

నీరుబొట్లు, నేకకూడా పోయినట్టు...

'బాగ్గానే—బేషుగ్గానేవుంది.'

'లేదుసుబ్బులూ! పూలమొక్కల్ని బాగుచాయమన్నావ్ కదూ, అంచాత, ఆనీళ్లుతోడిపోయడంలో నీపిలుపువిన్పించలేదు—క్షమించుసుబ్బులూ క్షమించు...'

'ఉహూఁ!...' మూతిబిగిస్తూఅంది.

'అయ్యోసుబ్బులూ! నీవుపిలచేవూఅంటే నేరాకండావుంటానా? వుండగల్నా? పోనీ; అటువంటి తప్పిడిపని మనయిద్దరమధ్యా ఎప్పుడయినా పెట్టేనా?' అంటున్నాడునాన్న.

ఆమె హద్దుపెంచుకున్న గర్వంగా, ముఖంత్రిప్పుకుని రెండడుగులు వెనక్కివేసింది.

'సుబ్బులూ! నీవట్టా, యింతమాత్రంలో అంతపనిచేసుకుంటావనుకోలా'

'ఏమిటది?'

చప్పున అని గుప్పున ఊరుకుంది.

'ఆముఖం విదలింపులూ, ఆశారీరం—బిగుశారీగం — బరువుల్నిమించిన నిట్టూర్పులూ—ఆవేదనలూ—పెదమొఖాలు—ఫీలింగుపోజులూ... ఆవీనూ.'

నాన్న ఆమె పెదవులమీదుంచివొచ్చే అల్పశబ్దానికి ఎదురు.

ఆమెతిరస్కారం—మౌనం—శూన్యం.

నాన్న నుదుటిలుపొందబోతున్న శరీరం చిన్నబరువు.

'సుబ్బులూ; సుబ్బులూ! నీవుఅల్లా భీష్మించుకొని కూచుంటే పనులెట్లా జరుగుతాయ్?'

చెప్పు—

నువ్వు చెప్పు...

నాలో ఏలోపమైనవుందా... లేదనిచెబతా. గానీ; నా తెలీకండా ఏదైనా వున్నదీఅంటే, దానికిపరిహారంగ నీయిష్టమొచ్చిన దండన విధించు—భరిస్తా!

అంతేకానీ నీవుఅల్లా భీష్మించుకూచుంటే, నాహృదయాన్ని, కాదుకాదు. నాజీవితాన్నే ఎవరో—పెద్ద పెద్దమంటలు చేస్తున్నారన్న మాట' నాగుండెలుమీదుంచి ఏడుక్కుపాదాలో చిందులు తొక్కుతోన్నై.

మాటలాడవ్ సుబ్బులూ? మాటాడవ్? 'అంటూ నాన్న' దీనంగా, ప్రాధేయపడుతో ఆమెచేతులు పట్టుకొని.

'ఇట్లాకూర్చో, ఏంచాయాలి? చెప్పు, తక్షణం ఆచరిస్తా'

ఇప్పటికి పెదాలు తడిచేసుకుంటోంది.

నాన్న అంతరాత్మ కదిలింది—నవ్వింది—పొంగింది.

"మీరుకాస్త ప్రక్కగా—దూరంగ..."

'సరే కూచుంటా లే! ఊఁ?'

'మీరు చెప్పమంటూన్నారుగన్క, చెబుతున్నా.'

'అల్లాగ్గేలా'

'నాతనువంతా మీకాళ్లు అర్పించేనో, అంకితంచేసేనో, అల్లా నే నిన్నబజార్లోచూచిన నెక్లెసుమీద వుండిపోయింది నాశక్తినరతట్నీ ఆబంగారపు గొలుసు లొక్కుబడి-యిట్టే ఆకర్షించుకుంది. అందుకు.'

'అదా సుబ్బులూ సంగతి? యింతమాత్రానికే నన్నింతగా టిక్కిరి బిక్కిరిచేసేశావ్—"

'మరి మీరు కొప్పడతారేమో అని''

'ఎందుకు కోపం? పిచ్చిదానా! నిన్ను పెళ్ళిచేసుకుంది మొదలూ, నీవు అడిగేదానికి ఏమాత్రమైనా తిరస్కరించేనా? నీవు నాప్రాణానివి-బహిర్ప్రాణానివి-ఎప్పుడూ నీనీ తియ్యటికబుర్లు-చల్లచల్లటి చూపులూ ఆనందిస్తూవుండే నాకు అవిఅలీతంకాదు.'

'ఒట్టు—?'

'ఎందుకుసుబ్బులూ ఆవెధవసట్లూ, ప్రమాణకాలూ, ఇదిగో వెంటనే బజారుకుపోయి నీకా-వాల్సున్నది తెచ్చుకో-' అంటూ యినప్పెట్టె తాళం అందించేడునాన్న.

సుబ్బులు అందుకుంది ఆతృతలో.

వెడతోంది.

'సుబ్బులూ—' అంటూ వెనుకే వచ్చేడు.

ఇద్దరూ ఇనప్పెట్టె చేరుకున్నారు.

మొదటిలో సంశయించేడు.

పిమ్మట సర్దుకున్నాడు.

ఆమె చేతులతోనే తాళంతీసింది.

పెట్టెలోకి నాన్నచేతులు పోయాయి.

కావాల్సిన ఐదొందలు రూపాయిలూ అందుకుంది-నాన్నమళ్లా తాళం భద్రపర్చుకున్నాడు.

సంతోషంలో తేచింది సుబ్బులు.

నాన్న దేనిలో ప్రాదేయపడ్డాడు ఆమెలోకి.

నాన్నునమస్కారం—

సుబ్బులు తిరస్కారం.

అంతమాత్రానికే తృప్తిపడ్డాడునాన్న

సుబ్బులుపోతూ,

'ఏవండీ మర్చిపోయ్యాను మరొకటి—'

దానికి కళ్ళలోనే ప్రశ్నించేడు నాన్న' ఏమిటని?

'సిన్నను వెళ్ళేసరికి బుకింగ్ ఆఫీసు కట్టేశారుగదూ, అల్లావెళ్ళి ఆసినిమాకూడా చూసొస్తా. మళ్ళా రేపటితో ఆపిక్చరు వెళ్ళిపోతుందుట—' యీమాట నాన్నమీద పిడుగుపడ్డట్టయింది.

"అదిగో! అడిగానో లేదో అప్పుడే పెదముగం వేశారు—పోన్లాండి నాకేమీ అవసరంలా! యిదిగో తీసుకోండి మీడబ్బు మీరు—" అంటూ ఫర్సును నాన్నముందు వుంచబోతూంటే—

'ఆఁ! సుబ్బులూ అంతపనే? సుబ్బులూ నీవిట్లా అంటూవుంటే నాజీవాలు పూడిపోతవి. అట్లానే వెళ్ళుదువుగా నీవే! అంటూ ఆమె చేయిపట్టుకొని లేవదీసాడు.'

'ఊహు, ఒద్దులాండి —మీమనస్సు నొప్పించిపోవడమెందుకు'

"అబ్బా, చంపకే, చూడునీవిల్లా లేనిపోని బెడదలతో నామనస్సును చీకాకు పర్చుతున్నావు. మరియిక లే! రా నేనువొచ్చి టిక్కెట్టుకొని పెడతా—'

'మరి యిల్లు—?'

ఆమాటలు నాన్నకు క్రొత్తగ జీవంపోసినట్టయింది.

'అయ్యో సుబ్బులూ! నామతిపోయినట్టేవుంది. ఊరికే నీవు పేచీపెడుతూంటే అట్లాగానీ, యిల్లు విడిచిపెట్టుకొనివస్తానా సుబ్బులూ'

లేచింది. నాలుగడుగులు వేసి—

'నేను వొచ్చేసరికి నీళ్లుతోడివుంచండి—సబ్బుబిళ్ళ అయిపోయింది. బీరువాలో క్రొత్తదివుంది. అదితీసి, బాతురూములో వుంచండి—' అంటూ వొయ్యారంగ— బిగువునడకలతో—శాండిల్సు వాయించుకుంటూ వెడుతూంటే—నాన్న ఆనందించేడు.

మరికోరిన పెళ్ళాంకదూ' అంచాత,

అతనికిఒకటే—

కొందరిభార్యల్లాగు, తనభార్యకూడా, బీచిషికారు — సినిమా ప్రోగ్రాములు — బర్మాశాండిల్సు — కత్తిరింపుజుట్టూవుంటే తనపేరు— "ఫలానాఆయన భార్య" అని చెప్పుకోవడం అతనికి గొప్పవిషయం.

అందుకనే అగ్నిసాక్షిగ వివాహమాడిన సాధ్విని వెడలగొట్టి, సోదరగ ఎలిపస్టును భార్యచేసుకున్నాడు.

---

## 3

నాకు సంవత్సరాలు ఒక్కటొక్కటిగా పెద్దవౌతున్నాయ్.

మెల్లగా నాజీవితాన్ని అర్థంచేసుకుంటున్నాను.

ముందు అమ్మచెప్పిందికదూ—'భర్తవుంటే గాజులూ, బొట్టూ వుంటుందనే' మరిఅవి అమ్మకున్నాయ్, గానీ నాన్న లేడు.

ఇంతవరకూ 'నాన్న' అంటే తెలీదు.

అమ్మ యిచ్చే సంతోషంతప్ప, నాన్న సంతోషం ఎరుగను. అసలు 'తండ్రి'' అనేవాడిమాటలు ఎల్లావుంటాయో.

నాకు రోజులు నిండేకొద్దీ—నాహృదయంలో యిమిడున్న కనబడని గాయముకూడా పెద్దదవుతూనేవుంది—తీరనిబాధ నిస్తూనేవుంది, అతికష్టంమీదా నష్టంమీదభరిస్తూ—బాధనొందుతూ అమ్మకు ఆనంద పాఠాన్ని చదువుతూనేవున్నాను.

ఐనా ఎన్నాళ్ళని అపుకుని నాలోకప్పివుచ్చి, కుమిలి కృశిస్తూ వుండటం.

అల్లావూరుకొని వుండడం నా బరువుకే అనుకున్నాను.

విశ్రాంతి సమయంలో అమ్మప్రక్కలో కూచున్నాను.

నాలోవుండి పిండిపిప్పిచేస్తోన్న ప్రతివిషయాన్నీ అనుమానాన్నీ అమ్మవద్ద వెళలగ్రక్కి, తగినసలహాలు పొందాలనీ, అడగాలనీ వుర్రూలూరుతున్నాను.

'అమ్మా' అన్నాను.

నాచిట్టిముఖంలోకి — విచారాన్ని వెన్నంటేనా తియ్యటిముఖం లోకి చూచింది.

ప్రశ్నించింది నేత్రాలతోటి—

'మరి చెబతావ్ కదేవ్ అమ్మా?'

'ఏమిటి చిట్టినాన్నా?'

'అదేనేవ్! నేనడిగేదే...'

కొడుక్కి—తెలీనివి, తల్లి తెలిపర్చడంభావ్యమనేమో — అమ్మ 'చెబతా' అన్నట్టు సూచించింది.

'మానాన్న ఎక్కడ?'

అబ్బా ఎటువంటిప్రశ్న వేశాను అమ్మకి?

'... ... ...'

'మరి ఏమేవ్ చెప్పవ్?

దానిమనస్సులోని చింతని తెల్సుకోకండా నేనల్లాప్రశ్నించలా.

అసలు నాకావిషయం ఎందుకొక్కావాలంటే — మాస్కూలు మాష్టారుకొడుకు చెప్పిపాడిచేడు 'ఒరేవ్ భానూ! నీవుదరిద్రుడివిరా — చూడు! మానాన్న ఎల్లామిఠాయిలూ—రంగచొక్కాయిలూ—బొట్లూ—గాట్లూ కొనిపెడుతూవుంటారో!' అని అది నాబుల్లిఅంతరాత్మలో యిప్పటివరకూ కదుల్తూనేవుంది—బాధపెడుతూనేవుంది.

'నాచిట్టినాన్నా! భానూ' అంటూ వొడిలోకి లాక్కుంది — ముద్దులుపెట్టుకుంది.

'భానూ మనభాగ్యసౌధం — కాదునాన్నా, నీభావిభాగ్యసౌధం జీర్ణించిపొయ్యింది—కూలిపొయ్యింది. కూలద్రోచేరు — కూలదోసింది.'

'ఎవరేవాళ్ళు?' అన్నాను బాలచంద్రుడులా.

అమ్మమౌనంగా—ఆవేదనగా చూచింది.

మఱొకసారి ప్రశ్నించేను తర్వాత? అని—

భానూ! మనం సంఘువుదృష్టిలో నామరూపాల్లేని మందభాగ్యులం—అగ్నిసాక్షిగా—సంఘకర్తల — ధర్మకర్తల సాక్షిగానాకు—పెళ్ళి చేసిన ఆప్రభువేమనల్ని యీవిధంగా విసరిపారేశారు. మనజీవితాల మీదుంచి అడుగులు వేసుకుంటూ పకపకానవ్వుతూ ఆనందిస్తూ పోతూన్నారు నాయనా!—

అందుకుమనం ఏంచాయగలంబాబూ!

మనకు దిక్కులేదు.

లోకంలో స్థానంలేదు.

జీవితాలు ముండ్లకంచెల్లో—పొదల్లో-తుఫాన్‌లో —సాంద్రగర్భంలో - పర్వతతలాల్లో - భగ్-భగ్‌న మండే-మూకే-ఎడారుల్లో—నశించిపోతూంది, కొట్టుకపోతూంది—వాటిల్లోంచి తప్పించే సానుభూతి పరుడు—దయామయుడు—జాలిపరుడు యీవిశాలవిశ్వంలో కన్నుపొడుచుకున్నా కనిపించడు! కన్పించలేదునాయనా—అని యింకాచెప్పబోయింది.

అంతవరకూ కనుల్లోనిల్పుకున్న ఆవేడినీరు — ఆస్వేతకణాలు, ఒక్కసారిగా రాల్చుకుంది— రాల్చింది నా తెల్లచొక్కాయిమీదపడినై యింకిపోయినై.

‘అమ్మా—అమ్మా—’

నాముఖంలో కళ్లుపెట్టింది.

ఏడ్పుతోంది—మరి నాకళ్లుచూస్తో వూరుకుంటాయా? ఊరుకోవ్, వాటికీ తెలుసు, సానుభూతిని చూపించేవి — దీనంగా — జాలిగా—బరువుగా మూడుబిందువులు రాల్చుకొన్నాయ్.

తనదుఃఖాన్ని మింగుకొని, నన్ను బుజ్జగిస్తోంది—నాన్నా! నాచిట్టి నాన్నా ఏడ్వబోకు. మనం యిల్లా ఘోరున దుఃఖించినంత మాత్రంలో ఎవరుచూస్తారు, ఏహృదయం కరుగుతుంది—జాలి పొందుతుందిభానూ?

ఆమె ఏడ్పుచాలించుకొని నాకల్లాబుజ్జగిస్తూంటే, అమాయకంగా అమ్మ కనుల్లోకిచూస్తూ, దొడ్లోపచెట్టునుంచి రాలిపోతున్న పారిజాతంపువ్వులువొంకచూస్తూవున్నాను.

చెబుతోంది.

'భానూ! నీవుపుట్టేవు, పదినెల్లునిండుకున్నావు. సత్యనారాయణ బావమ్మతో మాటాడుతున్నాను. నిను చూడ్డానికని చెప్పి వచ్చేమందు తనఊరినుంచి — నీకు విలువగల రంగుచొక్కాయిలూ, మిఠాయిలూ తెచ్చేడు అప్పుడు—ఆసమయంలో యింటివద్ద మీనాన్న లేరు.

వొచ్చిన అతణ్ని మర్యాదచేస్తూ—చేయాల్సినవన్నీ చేసి—ప్రయాణకబడలిక చేత, పడకకుర్చీలో విశ్రాంతితీసుకుంటూ కుటుంబవిషయాన్ని ముచ్చటించుకుంటూవున్నా భానూ! మీనాన్న ఎప్పుడు వొచ్చేరో ఏమో! వచ్చీరావడంతోనే నాజుత్తుపట్టుకొని—యీడ్చి—"

అమ్మ అల్లా చెప్పి, అప్రయత్నంగా ఆగిపోయి కంటతడితుడ్చుకొంటూవుంది.

'ఊఁ; చెప్పవే—తర్వాత?'

'చెప్పడానికేముందిబాబూ! ఆనాటినుంచీ నన్ను అనుమానించి హీనంగాచూస్తూ, నానాబాధలు పెడుతూ హింసిస్తున్నాడు. నేనల్లానే భరించి సంసారం దిద్దుతూవుండడంవల్ల మీనాన్నగారికి మరింతాబరువునుంచినట్టుగ గ్రహించేడు. నన్నేదోవిధంగా యింటినుంచి వెడలగొట్టించాలని పూనుకొనియుండడంచేత సమయానిగురించి ఎదురుచూస్తూన్నాడు. యింతలో; తాతకుజబ్బుమోపుగా వున్నందువల్ల నేను చూడ్డానికి పుట్టింటికి వెళ్ళక తప్పిందికాదు. నిన్ను తీసుకొనివెళ్ళేను. కొన్నిదినాలకి తాతకు ఆరోగ్యంకల్గింది. నన్ను మీనాన్నగారింటికి పంపివేయుడానికి తొందరపడుతూ వున్నాడు మీతాత. మీనాన్నగారు వొచ్చి తీసుకెడతారేమోఅని ఎదురుచూస్తున్నారు. కానీ మీనాన్నగారిరాక కొఱతయ్యింది.

నెలలుగడిచిపోతున్నవి. నామనస్సులో కుంటలు చెలరేగుతూన్నవి. మీతాత ఒకనాడు ప్రయాణంకట్టేడు. మనద్దర్నితీసుకెళ్ళి మీనాన్నగారివద్దవిడవడానికి. అందుకు నామనస్సువొప్పుకోలా.

ఎల్లా ఒప్పుతుంది?

రెండునెల్లనుంచి తీవ్రవిబాధతో—జబ్బుతో—చిక్కి శల్యమైయున్న నాన్నగార్ని ఆప్రియున్నానుంది విరమించి— నేనొక్కత్తెనే నిన్ను తీసుకొని అత్తారింటికి వెళ్ళేను.

ఏముంది ఆ యింట్లో!

వీధిగుమ్మానికి తాళం బిగించివుంది.

పక్కిళ్ళవాళ్ళని వాకబుచేశాను.

'అప్పటికి నెలదినాలున్నించి మీనాన్న ఊళ్లో లేరని' తెలిసింది. పోనీ ఆ అమ్మొచ్చేవరకూ, యింట్లోవుందారంటే తాళాలు వేసున్నై. ఎల్లా? తిరిగి ప్రయాణంకట్టేను. దార్లో పదిపదివిధాల నాహృదయం కంపించిపొయ్యింది. ఏ పనిమీదయినా వెళ్ళుంటే యిన్నాళ్ళుంటారా? పోనీవుండినంతమాత్రంలో 'యిల్లాఊరెళ్ళానూ — వెళ్ళేసమయంలో నీదగ్గరికొచ్చి చెబడానికివీల్లేకపోయింది' అని ఒకఉత్తరం ముక్కయినా వేయలేదు—యింకాయింకావస్తారనేచూస్తున్నాం—యీలోపులో రెండు సార్లు ఆయింటికెళ్ళిచూచేను. ఎల్లావేసినతాళాలు అల్లానేఉన్నాయ్.

మీనాన్నగురించిన ఆలోచనలమూలంగ నాగుండెచెఱువై పోతుంది. మీతాతకు యిదంతా అయోమయం—అగమ్యం!

ఇంతలో ఉత్తరమొకటివొచ్చింది.

ప్రియమైనమావగార్కి—

నాగురించిన ఆశలుమీరు, మీఅమ్మాయితోసహా విడ్చిపెట్టుకోవాలి. వాళ్ళజీవితాంతంవరకూ, కూతుర్నీమనుమణ్ణీ మీయింటోనే వుంచుకోవడంమంచిది నేనుమరొకవివాహం చేసుకున్నాను. 'బిడ్డ' అంటారేమో! వాడిగురించి నాకేచింతాదిగులూ లేదు.

నమస్కారాలు,

యిట్లు—మార్తాండం.

ఆఉత్తరం చదవంగనే మీతాత నిలువునా కృంగిపోయ్యారు. నీరైపోయ్యారు. ఆయనలినేత్రాల్లోనీరు ఆఉత్తరంమీదరాలాయి ధారధారలుగ.'

అని మాఅమ్మచెబుతూవుంటే నాకు మహింతాశ్చర్యం — ఆవేదనా విషమించింది. అమ్మకంటతడినిచూచి నాహృదయం కృంగి పోతుంది. కృశించిపోతుంది. కానీ పైకి వెలిబుచ్చలా, వ్యక్తీకరించలా, ఎందుకని—

'ఎందుకేవ్ చింతిస్తావ్? ఊఁ తర్వాత?'

'... ... ...'

నేనే అమ్మకన్నీటిని మరుగుపర్చుతూ మరోసారి అడిగేను.

దానికిల్లాచెబతోంది మా 'బదల్తి-జిందగి' గురించి.

ఇక మనకెవరుదిక్కు?'

'తాత! తాత!'

'అంతేనానా అంతే.' అని మళ్ళీ యీవిధంగా ఉపక్రమించింది.

'భానూ! మహామా ఆశలన్నీ కృంగిపోయ్యాయి. తాతవంశానికి యిదితీరనిమచ్చ అనుకున్నాం. రోజులు గడుస్తోన్న. నేనుకాయకష్టానికిపోక తప్పిందికాదు. పోకపోతే మనజీవితం ఎల్లాగడుస్తుంది? అంచాత నిన్ను తాతచేతులోపెట్టి కూలికీ—నాలికీ పోయేదాన్ని, నేనొచ్చేవరకూ తాతదగ్గరే పాటలు నేర్చుకుంటూ వుండేవాడివి.

నీవువళ్ళు పెంచుకుంటున్నావ్.

నీగురించిన ఆలోచనలు మాలో నిలువజొచ్చాయి.

మరోకపెళ్ళి చేసుకునేందుకు మీనాన్న-ప్రయత్నంలోవున్నారు కానీ ఒకవంక నీమూలంగ జంకుతున్నారు. అందుకు, సుబ్బులు తండ్రీ మేనమామా చక్కటిఆలోచన వేశారు.

నీతండ్రికి సంబంధించిన హక్కులు నీకూవుండడంచాతా, ఆ వారసత్వం వాళ్ళని కృంగదీస్తుందనే ఉద్దేశ్యంచాత, మీనాన్నకు ఇల్లా చెప్పేరు.

'మీకు మాసుబ్బుల్ని పునఃర్వివాహం చేసుకునేట్లయితే ఒక విషయం, వెనుకనీకు పుట్టినబిడ్డ ఎదుగుతున్నాడు, ఎప్పటికయినా నీక మీద కూర్చోకమానడు, అంచాత—నీబిడ్డకీ—నీహక్కుకీ—ఆస్థికీ, ఒకటే విటికి వచిన్నదానికన్నా వాడికి హక్కు—లేకుండా చాయాలి. అందుకు నీవు మాసుబ్బుల్ని 'రిజష్టరుమారీజు' చేసుకుంటే యీసమాదానికి మేము ఒప్పుకుంటాం'' అనివాళ్ళు చెప్పంగనే, మానాన్నకు ఆమెమీద మక్కువచాత 'ఊఁ' అన్నాడు.

నీకు భయపడి స్థిరచరాస్థులనన్నిటీన్నీ రిజష్టరీపెళ్ళాంకు—ఆమె పేరుమీద వేయించుకున్నాడు. అందుకు నామునలినాన్న చక్కటి ఆలోచనవేశారు.

మీనాన్నగారిమీద 'డావా' చేయించడానికి పూనుకున్నారు. కానీ, దానికితగిన—చాలినడబ్బు మనదగ్గరలేదు. దానికితాత చింతించలా. అంతకుముందు బ్రతికిచెడ్డవాడుగన్క—ఎవర్నయినా నోరువిడిచి అడిగితే రూపాయిలనోట్లు కురువకమానవు ఆడావాకి—లాయర్లకి కావాల్సినడబ్బు, తాతగారే సమకూర్చేరు మనువర్తిడావా చేశారు. వాయిదాలమీద వాయిదాలు జరుగుతూనేఉన్నవి. రెండేళ్ళు దొర్లి పోయినై...'

అంతవరకూచెప్పి చాలించింది.

తక్కినగాధ తర్వాత వినడానికి 'ఊఁ' అన్నాను.

ఇంతవరకూ ఆమె చెప్పినదంతా—నాహృదయకుహరంలో మారు మ్రోగుతునే వున్నాయ్.

ఒక "వ్యాసం" లాగు—నానోటుబుక్కు—మీద వ్రాసుకుంటూనే వున్నాను,

'ఎందుకు?' అని మీరు ప్రశ్నించవొచ్చు.

'తర్వాత చెబతాం!' అని నేననొచ్చు'

కాదుమరీ......!

## ౪

'మీకు జబడంకాదూ! లేవరేం?'

'ఈవాళకు... కాదు యీపూటకుమాత్రం వంటచేయలేను సుబ్బులూ...'

'ఐతే మీరనేదేమిటి?'

'నీవే... ఆకాస్తవంటూ... ...'

'శుష్కుగ్గానేవుంది. ఆమాట యీవాళంటే అన్నారుగానీ మరో సారి అన్నారంటే... బాగుండదు తెల్సిందాండీ—'

"ఏదో పొరపాటున అనేశా... క్షమించుసుబ్బులూ!' అంటున్నాడునాన్న. దానికి నిర్లక్ష్యంగా—గర్వంగా, చేతులుకట్టుకొని మరీ నడిచిపోతుంది వసారాలోకి!

ఆనాడు నాన్నకి కొంచెంవొంట్లో సుస్తీగావుంది.

అంచాత మా రెండోఅమ్మని—ఆపూటకి వంటచాయమని వేడుకుంటున్నాడు.

దానికామె తిరస్కారం.

అసలు 'వంట' అనేదేమిటో—చాయడమనేదేమిటో ఎఱుగని మానాన్న, నాటికి—అంటే కోరినభార్యని పునఃర్వివాహం చేసుకున్న నాటికి, వంటబ్రాహ్మణిలా తయారయ్యేడు—తర్ఫీదుపొందేడు.

వొచ్చినభార్యని వొళ్లలవకండా కూచోబెట్టిమరీ పోషిస్తున్నాడు ఆమెకోరింది; వేదాక్షరంలా పాటిస్తున్నాడు, ఆచరిస్తున్నాడు అదంతా మక్కువేమో!

లేనిఓపికతో ఏకోవిధంగా ఓపికకూర్చుకొని, వంటయ్యిందని పిలిచేడు—సుబ్బులు ఆరగించి, మేళవిస్తే, పక్వాలించింది.

నాన్న శక్తినికూడా దీసుకుంటూ, ఆపూటకి తృప్తిపడ్డాడు, బాధ ననుభవిస్తూనే!

మరునాడు నాన్నజ్వరం పెద్దదయ్యింది.

సుబ్బులు పరిచారాలు వైశాల్యం—మితం—అనుభవం.

అల్లాఅల్లాసాగుతోందన్నమాట ఆమెసాగుబడి.

కానీ నాన్నకు అసంతృప్తిగాతృప్తి — సంప్రాప్తి — సమాప్తి.

నాన్న నిండుజ్వరంతో మంచంమీద బాధననుభవిస్తున్నాడు, సుబ్బులు స్లిప్పర్లధ్వని నాన్న చెవుల్లోచేరింది. ఉదయంకాఫీతాగివెళ్ళిన భార్య, మధ్యాహ్న వేళ వొంటిగంటకు తిరిగొచ్చింది. కారణమేమిటని అడగలాభర్త.

వచ్చీరావడంతోనే నాన్నగదిలోకివచ్చి—

'ఏం! యిరవైనాలుగ్గంటలూ అట్లాముడిచుపెట్టుకొనిమూల్గుతూ వుంటే సరిపోతుందంటారాఏం? బావుంది. మీకేం' ఆకలా—ఆవేదనా? అంటుంది.

బరువుగా కనురెప్పల్ని విప్పేడు. చూచేడుసుబ్బుల్ని విన్నాడు.

'ఏం! నీళ్ళుయినాపెట్టేగా?' అని రెట్టించిన స్వరంతోఅంది.

నాన్నకు నోరువిడివడడంలా.

పెదవుల్ని తడిచేసుకొనేందుక్కు ప్రయత్నించేడు.

'దాహం' అన్నాడు అతికష్టంమీద.

ఆమాటలు వినిపించుకోకుండానే వెనక్కు తిరిగింది.

'సుబ్బులూ! దాహం!'

మళ్ళీఅన్నాడు ప్రాధేయకంగా.

ఈసారి విన్పించుకొంది. వెనక్కు తిరిగింది.

'ఏవిటీఅన్నారూ? సొగసుగానేవంది. నాచాతచాకిరీచేయించుకునేందుకనేవవిట నన్ను పెళ్ళిచేసుకున్నది?''

'ప్రయత్నంచేస్తున్నా—నేనే ఆదాహం చల్లార్చుకుందామని. కానీ మంచంమీదనుంచి లేచేందుక్కూడా శక్తిలేకండావుంది.'

'ఐతే మీరిప్పుడనేదేవిటి?

'పీకొచ్చుకుపోతూంది—'

'ప్రాణాలుగాని పోవడంలేదుగదా? వొచ్చిందిమొదలు పీక్కు-
తినేస్తున్నారు—ఇహా బట్టలయినా మార్చుకోకూడదల్లేవుంది. పొద్దు
టనగా ఇన్నిటీనీళ్ళుతాగిపోయాను. ఇప్పటివరకూ ఏవద్దనాలేదు—
అని తనగురించి చెప్పుకుంటుందేగానీ భర్తచర్యనుచూచి ఇన్నిమంచి
నీళ్ళుతెచ్చి అతనిదాహాన్ని చల్లార్చలేకండావుంది ఆమహాఇల్లాలు—
ఆగృహలక్ష్మి.

అల్లావుంది నాన్నసంసారం.

చరచరా గదిలోకిపోయి కట్టిపబట్టలువిడిచి మరోబురఖాతగి
లించుకొని, వంటింటిలో కళ్ళుపెట్టింది.

వంటపాత్రలన్నీ కాళీగావుండడంచూచి మండిపోయ్యింది.

'దాహం దాహం' అని నాన్న పిలుపు.

'వెధవపీనుగ' అని భోజనహోటలుకు పయసంసుబ్బలు.

చూచేడు భార్యఅల్లాపోవడం.

చూచిమాత్రం ఏంచేస్తాడు—ఏంచేయగలడు.

'కోరినపెళ్ళాం—రిజిష్టరీ పెళ్ళాంముందు, నాన్నజీవచ్ఛవం.

ఇహా దాహంతో నాన్నఅల్లావుండాల్సిందే. మగ్గిపోవాల్సిందే.
వుండక ఏంచేస్తాడు పాపం! లేచి నీళ్ళుతాగేందుకూడా ఓపికలేదు.

కానీ కోరుకున్నపెళ్ళాంయొక్క హృదయం నేటికిఅర్థపర్చుకుం
టున్నాడు—పర్చుకోగలడు.

* * *

మరునాడు అమ్మచెబుతోంది.

'భానూ! మీనాన్నగారిమీదచేసినదావా అల్లానే నడుస్తూంది.
వాయిదాలమీదవాయిదాలుగ మనపక్షమాత్రం ఎవరూలేరు.
లాయరుతప్ప' అని చెబుతోంది.

'ఐతే భగవంతుడు, లేడులే' అన్నాను.

తలూపించింది.

'భానూ! సాక్షులగురించి మీనాన్న, ప్రతివాయిదాకూ, ధారా
ళంగ ధనం ఖర్చుబోతున్నాడు. ఒకనాడు విచారణప్రారంభమయ్యింది,
మొదట మీనాన్ననుపిలిపించి అడిగారు న్యాయాధికారులు. యీవిధం
గా చెప్పేడుమీనాన్న.'

'యీామెకూ నాకూ వివాహం జరిగినమాటవాస్తవం... కాని.'
అని చెబుతూ ఆగిపోయిందిఅమ్మ. విచారరేఖలు తాండవిస్తోన్నై అమ్మ
ముఖంలో. నేనుపీకుడిలాధైర్యం చెప్పినతరువాత—మళ్ళీ ప్రారంభించింది
చెప్పడం.

ఈమె మనోకనితో నన్నుకాదనిపోయింది— వేళ్ళతరబడి మా
యిద్దరకూ ఏసంబంధం లేకుండావుంది. నేనూ ఆమెనుపూర్తిగా విడిచి
పుచ్చేను... అన్నాడు.

ఇహ సాక్షులు—

వీళ్ళ పెళ్ళిమాటనిజం—సంబంధం తిరిగిపోవడం, ఆమెసంగతి
యీమార్తాండానికి, యీమార్తాండం సంగతి ఆమెకు లేకపోవడం నిజం

మనోహాటి—

ప్రస్తుతం యీామెకున్న కుఱ్ఱాడు మార్తాండం యింటిపేరు పెట్టు
కొని పిలవబడుతోన్న కుఱ్ఱాడు మార్తాండానికి పుట్టలా అన్నారు—

న్యాయస్థానంలో—న్యాయవాదులూ న్యాయాధికారులూ ఎదుట
ఆసాక్షులు అంతటిమాట అనడంతోనే నాహృదయం బరువెక్కింది.
పగిలిపోయింది—కన్నీళ్ళు ధారధారలుగ సాగినాయి.

ఏంచెప్పను భానూ!

ధర్మకర్తలు—సంఘకర్తలు—పెద్దలు, తమచేతులతోటి, వారికీ
నాకూ గర్భగుడిలో పెళ్ళిచేసిన మహామహులు! నీకుపురుటికర్మా,
భారసాలా జరిపించిన ఆన్యాయవిశారదులు ఆనాడు—కోర్టులో యీవి
ధంగా నాకుచెప్పేరు. దానికికారణం, తగినవిలువ లేకపోలేదు,

[illegible] జష్టికి పెత్తనం!

డబ్బు! డబ్బు!

అది అంతపని చేయించింది—చేయిస్తూంది.

ఆనాటికి ఆసంఘకర్తల విషయహృదయాలు—పాషాణహృదయాలు—కఠుకహృదయాలు నాకు అర్థమైనాయి. డబ్బుకాశించి, ధర్మాన్నీ—న్యాయాన్నీ—సత్యాన్నీ మాయపర్చిన—మట్టుపర్చిన ధర్మకర్తలు అల్లాచెప్పారు నాయినా!

ఇహ ఆకోట్టంలో మనకు నిలచేందుకు తావు లేకపోయింది. ప్రపంచంలో సత్యానికి స్థానంలేదు, లేదుముమ్మాటికీ!

ఆపెద్దలూ—ప్రభువులూ, యింకా మనలాంటి అనాధులజీవితాన్ని పడదోసి—ఏడిపించి—దోపిడీచేసి—ఖూనీచేసి—అమాయకుల ఆత్మల్ని వంచించి—నిజాన్ని నాశనంచేసి—భగవంతునికి జంకకుండా యింకా యెంతకాలం అల్లా డబ్బుదోచుకుంటూ—మన బ్రతుకులమీదనుంచి పకపకా నవ్వుతూ వెడతారో నాయినా!'

ఆవిధంగా నాముందుజీవితకధని కొంతవరకూ తెల్పుకోగలిగేను అమ్మ కన్నీటిని వొత్తేను, ధైర్యంచెప్పేను.

అబ్బా! యీకాలచక్రానికి ఎంతమహత్తరశక్తి.

ఎందుకూ పనికిరాకుండా మమ్మొకమూలకి విసరిన యీచక్రానికి అంతటిశక్తి ఎక్కడిదో!

ఈనాటికి కాకపోయినా, మరోనాటికయినా మాఅనాధజీవితానికి తృప్తిఅనేదివుందా? మాలాంటి అనాధులూ అభాగ్యులూ యింకా యింకా, యీచిత్రవిచిత్ర ప్రపంచంలో ఎంతమంది వుంటారో!

ఏమో ఎవరు అనుకుంటారు?

ఐనప్పటికీ నాకు చిన్నధైర్యం.

'ఎప్పటికయినా, నాన్నకు గుణపాఠం నేర్పాలట'

అది అసాధ్యమేమో.

మానసికృష్టజీవితాలకి ఏ ఒక్క క్షణమైనా ప్రకృతి జ్యోతి వెలుగు గోచరించక మానదు. భూమిలో ఎన్ని విధాలు?

జెర్రిలూ, తేళ్ళూ, బొద్దింకలూ, కుమ్మరిపురుగులూ, ఎలుకలూ కప్పలూ, పాములూ ఇంకా తీవ్రగాతీవ్రగా గోచరించే, లభించే మణులూ—రాత్నాలు!

అల్లానే ఏ ఒక్క నాడైనా మాకు ... శాంతి లభించకపోదు.

మాకే కాదు—మీ జీవితాలికున్నూ.

నే ననుకుంటున్నాను—

మా విచారాలూ, చింతలూ, సంతోషానికీ సుఖానికీ అని.

మురికి కాలువల్లో—బురదగుంటల్లో లభించడం లేదూ—కోహాలూ?

అల్లానే అనుకుంటాను.

జరిగిపోయిన మా కుటుంబ నాశనమన్నిటినీ నా చిన్న డైరీలో చెప్పుతునేవున్నాను. నా బుర్రలో Teaching చేస్తునేవున్నాను అంతరాత్మకి నాకు నేనే Critic is critic—

* * *

ఇది ఐదోసారి తనని అల్లా తిరస్కరించి బైటకిపోవడం.

నాన్న మంచంమీదుండగనే బహుళింవెళ్ళి, కృష్ణపక్షం వచ్చింది. ఆ చీకటిపక్షంలో నాన్నజీవితానికి – హృదయానికి చీకటే ప్రాప్తిస్తోంది.

'మార్తాండంగారూ!'

జవాబు—హీనస్వరంతో మూలుగు.

లోపలకొచ్చి—

'బాబూ! అమ్మగారు తేరనుకుంటూ—'

'ఏం ...?' కళ్ళతోనే ప్రశ్నించేడు నాన్న.

ఈ బిల్లు కాగితం చిత్తగించేరూ?

'అంటే—'

అమ్మగారు మాకొట్లో వాడుకున్న వాడకం.'

'దేనికని—?'

'చీరలూ—జాకెట్లుకని మూడొందలరూపాయులు.'

'ఆఁ! ఎంతన్నావ్! మూడొందలా'

'చిత్రం—అల్లా ఆశ్చర్యపోతారేం—'

'సరే. మరోసారి అవుపించు—'

అతిక్లిష్టంగా—ముక్తసరిగ సలహాయిచ్చేడు నాన్న. బట్టలకొట్టు గుమస్తా తిరుగముఖంచూచేడు.

'ఆరిదీనిబండారం బండగానూ, ఏండబ్బు ఏండబ్బు తగలేసేస్తుందీ! యీరోజుల్లో మూడొందలరూపాయులకి మూడుచీరలూ, మూడుజాకెట్లా ఆరిదీన్నితగలయ్యా—'

అట్లాతలంచుకుంటూండేసరికి మరోపిలుపు—

'బాబుగారూ!'

నాన్నసలహా లేకుండానే—లోపలకొచ్చి—

'డబ్బు పంపించేరుగాదు'

సాశ్చర్యంగచూస్తున్నాడు ఆవచ్చినముఖంలోకి.

'ఏం అల్లాచూస్తున్నారు? మీఆవిడ నూటపాతికరూపాయిల వంటసామగ్రి పట్టించుకుంది. డబ్బుమిమ్మల్ని అడిగిపుచ్చుకోమంది.'

మరికొంచం ఆగి—

'ఇపుడేయిప్పిస్తే మాఔసరం తీర్చినవారవుతారు—'

'నాన్న తెల్లబోయిచూస్తున్నాడు.'

'మార్తాండంగారూ! మిమ్మల్నే!'

'ఆఁ! మరోసారి అవుపించు—'

ఆగుమస్తాకూడా తిరుగముఖంపట్టేడు.

ఇంతలో షికారునుంచి తిరుగముఖంపట్టిన సుబ్బులు టిక్—టాక్ శబ్దంచేసుకుంటూ వచ్చింది.

ఆమె వచ్చినక్షణంలోనే నిల్చున్నా పాతిపెట్టేయాలనుకున్నాడు. అనుకోడుమరీ అనవసరంగా అయిన డబ్బంతా అల్లా ఖర్చుపెడు తూంటే! చిన్నరాగం తీసుకుంటూ తనగదిలో బట్టలుమార్చు కుంటోంది.

'అమ్మా—సుబ్బులూ!'

'ఏంనాన్నా వచ్చేవ్? రాలోపలికి—'

మార్తాండం ఎక్కడ?'

'ఆమూలగదిలో మంచంమీద—'

'ఐతే యిల్లావిను—'

తండ్రి సామీపంలోకి వెళుతుంది.

'అమ్మా! ప్రస్తుతం నూటపాతికరూపాయలు కావాలి.'

'ఉష్! నెమ్మది—ఎందుకు నాన్నా అంతడబ్బు?'

'మనం కొనాలనుకుంటోన్న ఆమేడ బేరానికి—'

"దానికయితే యీమాత్రం సరిపోతుందా?'

"అబ్బే! మేడగల అసామికి డబ్బుఔసరం—అందుగ్గా యిడ్వా న్సుక్రింద ఆడబ్బు కావాలంటున్నాడు.'

'సరే, నివిక్కడనే కూర్చో—'' అనిచెప్పి భర్తకు విన్పించ కండా, కన్పించకండా యినప్పెట్టిచేరింది. తనతండ్రికి కావాల్సిన మొత్తాన్నియిచ్చి, మెల్లగా సాగనంపింది సుబ్బులు.

అమాయకుడైన, మానాన్నకి దేమీ తెలీదు.

నాన్నదినాలు కుంటి కుంటిగానే నడుస్తోన్నా

సుబ్బులు దినాలు మాత్రం చలాకీగా సాగిస్తోంది.

ఇంకెన్నాళ్ళకు నాన్న—సుబ్బుల్నీ—ప్రపంచాన్ని అర్థంచేసు కోగలుగుతాడో—

అసలు అర్థంచేసుకోగలశక్తి వున్నదో లేదో!

౫

అబ్బా! ఎంతెంత మార్పులు వస్తోంటై!

ఈనెలరోజుల్లో నాన్న యినప్పెట్టె పల్చగా తరిగిపోయింది. ఆదీపంలోనిచమురు మరెంతో లేదు. చీకటింటిలోనే చిన్నచిన్న అడుగులు వేస్తోవీక్షిస్తున్నాడు.

గాలిదుమారం—

దాలోనే; ఆతుఫానులోనే కుంభవృష్టిలా వర్షపాతం.

పండుటెండలో – మాడి—బీటలువారిన మైదానాలూ, గుంటలూ—నిండునీరుతో వుమ్మళంగా సాగుతోంది.

పెద్దనదుల్లోని నీరు ఆగకండా కాలువలు పట్టింది.

ఏటిగట్టు తెగింది—

నాన్న సంసారసాంద్ర్యం గట్టు తెగింది.

దాలోని బంగారప్రవాహం—సుబ్బులు పూరింటిలోచేరింది.

నవగ్రహాలూ ప్రతిక్షణం తాండవించే సుబ్బులు పుట్టిల్లుపెద్ద భవనంలా వెలిసిందినేడు సుబ్బులు నాన్నా యితర్లు, రంగురంగుల అద్దాలుమేడల్లో గొలుసులుయ్యాల్లో ఊగుతూ, విశాలవాయువుల్ని పీల్చుకుంటున్నారు.

ఇంకా లేస్తోన్నై మేడలుమీద మేడలు.

నాన్న తేరుకుంటున్నాడు.

కళ్ళు తెరిచేడు—ఆకళ్ళకు కప్పివున్నపొర [illegible] జీర్ణించి పోతోంది—తొలగిపోతూంది.

ఏమిటీమార్పంతా?

సుబ్బులు చాకచక్యం, మహిమ.

ఊళ్లోని డైమండ్సు వర్తకులకు పెద్దబాకీలు వేసింది—బట్టలషాపు కార్లకీ, హోటలు యజ్మానికీ నంపలాదిగా విరాళాలుసమర్పించింది.

ఇంట్లో సర్వహక్కూ సుబ్బులదే! మరి రిజిస్టరీ పెళ్ళాం.

నాన్నకుండుకున్న స్థిర–చరాస్తులనన్నిట్నీ సుబ్బులు పేరుమీద రిజిస్టరీ చేయించాడు. అలాచేస్తేనేగానీ, ఆమహాయిల్లాలు; నాన్నకు గృహిణి కాలామరి.

ఏడ్చుతూన్నాడు—నవ్వుతోంది భార్య.

తన ఆనందాన్ని భర్తకు తెలీనీడంలా సుబ్బులు.

నాన్నగుండెలమీద— కాళీయినుప్పెట్టెమీద, ఆమె చుట్టపక్కాలూ, తండ్రి మొదలైనవారంతా వింతవింతనడకలు—పకపకలు—గీవితో ...

రెండునెల్లులో చివరివారం జరుగుతోంది.

ఆనెల తెచ్చిన వంటలసామగ్రి ఆఖరయ్యింది.

మళ్ళీ తెచ్చుకోనక్ఖర్లామరి!

అంచాత ఇనుప్పెట్టి దగ్గరకెళ్ళేడు.

గుండె చెఱువయిపోయింది–పగిలిపోయింది. కళ్ళంటనీరు గిరుక్కున తిరిగింది, రాలింది జలజలా... ఆపెట్టెలోంచి నాన్నను ఎవరో చేయెత్తి ఎలుగెత్తి ఆహ్వానిస్తున్నారు, నవ్వుతున్నారు.

అదినాన్న చూడలేడు—భరించలేడు—తల్చుకోలేడు.

గదిలో Make up అవుతూన్న ఆమెను చూచేడు.

ముందుగనే ఆమెచూచి

'ఏం! వొచ్చి అల్లానేచూస్తూండి పొయ్యేరేం?'

మెల్లగా, ఆమాటల్లో రహస్యంగా ఇమిడ్చిన వలపులో–వొయ్యారంతో అడిగింది.

ఆలోచిస్తోన్నాడు, మధ్యమధ్య పొడిగాదగ్గుతో.

'ఒంటోబలం చేరందే లేచారు—వెళ్ళి మంచంమీద...'

అర్థోక్తిలో ఆగింది.

'లేనులేను. ఒంటోనూ ఇంటోనూకూడా బాగోలా''

పెద్దకష్టాన్ని, బరువునీగుండెలమీద మోస్తున్నట్టుచేప్పేదునాన్న మీకు అర్థమయ్యేవుంటుంది కాదుమరి.

కత్తిరింపుజుత్తుతో, సుబ్బులు—సిల్కు-చీరా, మైనాదూదిజాకెట్టూ కంఠంలో లక్కలూ, నాలుగుపేట్ల గడియారపుగొలుసూ, ఒకచేతికి నాలుగుజతల S. G. M. గోల్డుగాజులూ, మరోచేతికి చిన్నరిస్టువాచీతో నించుకపోయిన నొసలు, అణిగాగిపోయిన చిన్నిస్తుముక్కు మచ్చలదవడలూ వాటితో మహోత్సవంగా నడుస్తోంది.

ఇహ నాన్నంటారా?

తేనెటీగలురంధ్రాల్లా తూట్లుదేరినహృదయంతో, ఎఱుపుజీర ఏవగించని లోతుకళ్ళతో, అరుస్తోన్నపేగులతో, అభాగ్యాన్నీ, అనాథత్వాన్నీ, అరచేతిలో పెట్టుకొని చూస్తోన్నాడు.

ముఖం తప్పిపోయింది నిత్యాన్నీ—సత్యాలన్నీ.

గుబురుగుబురుగా, అసహ్యంగా, భయంకరంగా, సుకుక్షి గర్భంలో దాచుకున్న నల్లమబ్బుల్లా, వెండ్రుకలు మొలచేయి.

అనుకోనట్టుజరిగిన యీవింత స్వప్నానికీ, సృష్టికీ, తబ్బిబ్బవుతూ కాదని వేరే దల్చుకోనవసరం వుండదనుమానం.

సుబ్బులు కడుపునిండుగా పాలు పాయసాలు నింపుకుంటోంది.

భర్త లోతుకుదించుకపోయిన కడుపును చూస్తోనే, తనఆకల్ని అణగాదొక్కుకుంటోందా ఇల్లాలు. ఈరోజులుకూడా సిగ్గించేయి. ఒక నాడు నాన్న అల్లాడిపోతున్నాడు, దహించుకుపోతూంది ఆకలిమంటలు జ్వాలలుచాల కడుపు.

గడచినగంటల్లో పచ్చిమంచినీరుమాత్రం ముంటుకున్నాడు

ఆమెహాయిహాయిగా, కమ్మనికలలుకంటూ, జాబిల్లిచలువలో, వెన్నెల్లో, మారుతీ—మందార—మందమంద వాయువుల్నిపీల్చుకొంటూ మెత్తనిదిండ్లమీద పవళించింది.

లోకానికీ తనకీ మరేసంబంధం లేనట్టుగా!

మా నాన్నని—తనభర్తనీ పిండివడబోస్తున్నట్టుగా!

ఇంట్లో దమ్మిడీ లేదు.

సుబ్బులు గదిలోకళ్లుపెట్టేడు.

ఆమెవస్తువుల్నీ, బట్టల్నీ, సొన్నబుక్లనీ, పౌడరుడబ్బాల్నీ చూచేడు. ఈపరిస్థితిలో వాటికి బజార్లో ధర పెడితే కొన్ని వందలు.

ఆచీరలు మరోకొన్ని వందలు.

తనఆకటిబాధనూ, కుటుంబబాధను వాటినితీర్చుకుంటే బావుండునను కున్నాడు. కాని దానంత నీచమైనకార్యం, అగౌరవమైన మర్యాదా మరొకటి లేదనుకొని, నాటికదుపుమంటల్ని అణచిపెట్టుకున్నాడు. కొంతకాలం ఇంట్లోనిసామాన్లు చాటుగ, తనహోదాన్ని మరుగుచేయ కండా అమ్మివుంటూందన్నాడు.

అదిసుబ్బులికి తెల్సినపుడల్లా—

ఇవన్నీనావి—నాహక్కు, నాపేరున చలామణీఅయ్యేఆస్తులు, వాటిమీద మీకేహక్కూలేదు అంటుంది. అంది

నిజమేమరి. ఆమెనే రిజష్టరీచేసుకొంచేడు.

అయ్యో నాన్నజీవితం ఎట్లామారిందీ?

ఆఇంట్లోనిప్రతీవస్తువులో నాన్నరక్తమాంసాలు ఇమిడివున్నై, లేవుమరీ?

తనతొక్కల్ని ముక్కలుచేసుకొని, చెమటోడ్చి, రక్తమాంసాల్ని చిక్కచేసుకొని సంపాదించినవస్తువులు—ధనం—హక్కు, మరి తనకే వాటిమీద పూతికపుల్ల హక్కయినాలా

ప్రపంచమంతా ఇంతేనా!

అందమైనమబ్బులన్నీ మనకు అవుపిస్తోన్నై, వాటినిచూచి మనం యెంతగా గర్వపడతాం — ఆనందిస్తాం — పొగడుతాం సృష్టి విపరీతానికి?

కానీ; వాటిల్లోని సారం — లోతులూ — వైశాల్యం మనం గుర్తిస్తామా? గుర్తించగలం? అదొకటి తెలుసా?

భగవాన్ ఎంతవిచిత్రవిచిత్రమయ్యా నీచేత.

ఈపాంచభౌతిక దేహాల్నీ, చేతనాచేతనాప్రపంచాన్నీ అర్థం చేసుకోలేని మానవుల్ని యెందుకయ్యా సృష్టించేవ?

అవి సిరిలాస్సాధకనీ, తృప్తినీ, సంతోషానికి భిన్నాను. శాస్త్రాల్లోనూ, శిల్పకళల్లోనూ.

---

౬

సర్వన్న సుబ్బుల్ని వారాచి—

'ఏమ్మా! భాగ్గాకుదరింపగనూ మేపకట్టడం?'

ఎదురుగాపోయి ప్రశ్నించేడు.

'సరే, నాన్నా! మీకుయెక్కువగా ఋతన్నలతో స్నేహించాయు కండి. మామార్తాండం యీమహ వెలుగునంతట్నీచూచి సాశ్చర్యంతో కుమిలికుమిలి సహాయిపోతున్నాడు.'

'అట్లానా! ఐతే; నీవు వాడిధనాన్నంతట్నీ, ఝల్లామనింటా జారవిడిచినట్టు గ్రహించేడావేం?'

అదేంలా! కానీ ఉంటుంది.'

'ఉండదు లేతల్లీ! పూటకు తినడానికి గతిలేనిమనం, ఆకులెగిరి పోతోన్న చిన్నపాకలోవుండేమనం, యీనాడు యీరీతిగా రాజవైభ వాలతోటి, రంగురంగుల భవనాల్లో, పందిరమంచాలమీద, 'కడుపు లోనిచల్లకదలకండా, లోకాన్ని వెక్కిరిస్తోండడంచూచి అనుకోమూ?'

అతనుగాకపోతే వెనకప్రపంచమైనా తలపోసుకోదుటే అమ్మాయ్? తాత్కాలికంగావొచ్చిపడిన నడమంత్రపుసిరిగురించి?'

'ఆఁ! మాయలోకం అదేమనుకుంటే మనకేంనాన్న?'

'నిజంచెప్పేనేసుబ్బులూ'

'చూడునాన్నా! మొన్న ఇట్లాగే అగ్గినేస్తా. ఆకటికితాళలేక నాదగ్గరకొచ్చి అంటాడుగదా?'

వాసేక! మనం ఇంక ద్యాసకు వొచ్చుకోలేం...'

'అన్నట్టు—నీమాటకస్సువొచ్చేన—నువ్వుమాత్రం ఆకలివున్నట్టె నటిస్తూ బాధపడ్తున్నావా?

'అదనీవుచెప్పాలా ఏంనాన్నా?'

'లేదులా, మరోసారిచెప్పడం మంచిదికదుకేంటి... లేకుంటే నీవు ఇక్కడకొచ్చి పూర్తిగాభోజనంచేస్తే, మార్తాండాన్ని అల్లాకతిక కూపాన్ని నిలబెట్టడం గుర్తించేదూ అంటే...'

'గుర్తించినంతమాత్రంలో ఏంచాయగల్గుతాడు?'

గర్వంగా—విజయరాణీలా చెప్పిందట్లా.

'ఇంటో సామాన్లూ అవీ ధరపెట్టబోతాడు—నీవుమాత్రం జాగ్రత్తగావుండి, వీలైనంతవరకు అవిపోకండగా మనింటో చేర్చేటందుకు ప్రయత్నించాయాలిసుమా!'

'ఏంచివుకు లేదునాన్నాదానికి. ఐనా ఇంకా ఏమంత పెద్దవస్తువులూ సామానులూ వున్నాయ్గాదాలా. ఐనివన్నీ ముందేచేర్చేశానుగ నీదగ్గరకు—'

"అదిగో అదేవనికిరానేలఅమ్మాయి, ఏచిన్నదానికైనా మనం జాగ్రత్తపడకపోవడం అవివేకం—అవినీతి."

"అట్లానేలా, సాయంత్రం మాచివంటకాలుచేయించునాన్న — నాస్నేహితులకిద్దరికి భోజనంచెప్పేను—"

"సరేవెళ్ళు. మార్తాండంయెదుటమాత్రం ఆకలిమంటతో మలమలమాడిపోతూన్నట్టు నటించడం మర్చిపోయేవుసుమా" అతణ్ణి అట్లా హెచ్చరిస్తూ సాగనంపేడుసుబ్బుల్ని, ఆమెతండ్రి.

కొంత దూరం వెళ్ళి తిరిగొచ్చి—

"నాన్నా! ఒకేళ ఆ యింటోని చిన్న వస్తువులు తెగినమ్మేందుక్కు. ఆయన ఒప్పుకుంటే, అవి నీదగ్గర కేపంపిస్తుంటా, నీవు పగానికి సగం ధర పెట్టి పుచ్చుకుంటూండు."

"ఔను. యిది—యీ ఉద్దేశ్యం బావుంది."

"మరి వుండు—వొస్తా"

సుబ్బులు మిత్రుల్ని కలుసుకుంటూ సూటామంచీ చెప్పుకుంటూ బయలు దేరింది.

జీర్ణించిపోయిన యింటో పడినాన్న, గతాన్ని తల్చుకుంటూ కంట నీరు గ్రక్కుతూవున్నాడు. ఒకవొంక ఐదబొబ్బా, వస్తువులూ పోయినాయని తల్చుతాడో, మరోవొంక ఏ దాబ్బధకుపడి నిల్చుతాడో అయోమయంగ శూన్యంగ వుంది.

మతిచెడిపోతూంది.

ధైర్యంచేసి తనుసంపాదించిన వస్తువుల్ని అమ్మకొసతినేందుక్కు, వాటిమీద తన కేహక్కు లేకుండా పోయింది.

"సుబ్బులూ" వొచ్చిందాన్ని పిలచేడు.

శక్తిజీర్ణించిపోయినట్టు—వాలిపోయినట్టు—నలిగిపోయినట్టు నటిస్తూ చిన్నశబ్ధంతో "ఊఁ" అనుకుంటూ బరువుగావచ్చి మంచంమీద కూలబడింది.

'అయ్యోసుబ్బులూ, నాతోబాటు నిన్నుకూడా తీరని ఆకలి మంటలకు ఆహుతిపగ్చుతూన్నాను. తుచ్ఛుణ్ణి—యిటుచూడు సుబ్బులూ తలవనితలంపుగ ఆసన్నమైన, ప్రాప్తించిన యీమన అభాగ్యానికీ, దుస్థితికీ, దరిద్రానికీ ఒకఉపాయంతోచింది—'

'ఏమిటి?'

ఆమె లావుపాటి పెదవల్ని తోంచుకుంటో, బరువుగవచ్చిందా మాట—

'ఇహాపోనేపో...నై పెద్దపెద్ద సామ్ములూ వస్త్రప్రల్లూ—మిగిలిన యీచిన్నవాటికైనా, చాటుగ తెగనమ్మి కాస్తగంజికైన పూటయినా తాగుతూవుంటే, మనప్రాణాలు తేసుకుంట్టి—

అల్లా చెబుతూంటే సుబ్బులు దుఃఖం పొంగి పొంగి వస్తోన్నట్టు—దాన్ని బలంగా అదిమిపట్టుకుంటూన్నట్టు సూచిస్తోంటించింది. రెండు మూడు నీటిచుక్కలు బుగ్గనంతంగా రాల్పుతోంది.

మరిఔనరంగాసూ! అంటాత.

'సరే చివరికి యీమాత్రం సామాన్లయినా లేకుంటే సంసార మేమిటి—'

'ఇంకా సంసారమనే పోగుతున్నావ్. ఏముందిసుబ్బులూ, నాలో ఏకోశమైనా, తప్పు యిగావుండంటూనా, చేశానంటూనా? వున్న ధనరాసుల్నిచూస్తే కడుపునిండిపొయ్యే అనగల్ని నేనేమైనా ముట్టు కున్నానా, అంతానీవే తెగనమ్మింది—ఉన్నడబ్బు లెక్కచేయకుండా విరివిగా ధారాళంగాపోసి, చీరలనీ, ఫాన్సీసామానులనీ, వింతవింత నక్లెస్‌లనీ ఖర్చుబెట్టుకోంది నీవేగా?

'మీరనేదేమిటి—

అంతా పోయింతర్వాత, నాశనమయ్యింతర్వాత నేనంటాని కేముందిసుబ్బులూ, వున్నదాంతోఅన్నా, కడుపునిండుగ ఏవక్క రోజయినా తింటేచాలు.'

'తర్వాత—?

'మనమేంచేస్తాం, యిహాకనుపించేది ఒక్కయిల్లుమాత్రం—'

అని చెప్పబోతున్నాడు—భార్యముఖంలోకి చూచేడు, రాటు దేరిన దవడలంట జాలువారుతుంది కన్నీరు, చెబుతోంది.

'అయ్యో నాబ్రతుకు బండలుగానూ, చివరికి ఎటువంటి బ్రతుక్కు గురికావాల్సొస్తుంది—ఆయినింటి సమందాన్ని కాలదన్ను కొని, మీకుచేరేను. అయినా విధితప్పుతుందా సరేకానీవండి—'

## రిజష్టగీ తా గ్లాం!

నామాటలువిని లేచింది.

"దేనికేడుస్తున్నావ్?" అంటూ దానికన్నీటిని తుడుస్తూన్నాను. నాదిఅనుభవనీయమైన జీవితంగాకపోయినప్పటికీ ప్రపంచంలోని దూరదూరాల్ని, లోతుల్ని అర్థపర్చుకున్నాను.

దాలో నాన్నవిక్రుష్టజీవితం వింతగా పూర్తిగ అర్థపర్చుకున్నా.

"అమ్మా! నువ్వాకఃఖించడం—ఖేదపడడం దేనికో నాకు తెలుసు. లోకంలో బ్రతుకుదెరువులు రకరకాలు, నాన్నగురించినచింత నీకు పెద్దది. నేటికిఅర్థమయ్యింది తనజీవితం అర్థంచేసుకున్నాడు—ప్రాణాలు చెదరిపొయ్యాయ్. రక్తం ఉద్రేకంతో చల్లదనంతో కాలుతూ—ఉడికిపోతూప్రవహిస్తోంది. ఒకనాడు ధనరాసులతో తులమాగుతూ — మన అభాగ్యజీవితాల్నిచూచినవ్వుతూ, గుండెమీద చే..సేసి హాయిగ గాలిపీల్చుకొనేనాన్న యీనాడు అల్లావీధులంట — సముద్రపుటొడ్డులంట—మైదానాలంట బికారిగా—చంచలహృదయంతో—కంటతడితుడ్చుకుంటూ—ఆకలిచిచ్చుకు దహింపబడుతూ—కఠిక ఉపవాసాలతో ఏచెట్టునీడనో తలవాల్చేరోజులు మనకళ్ళంట చూస్తున్నాంకదుటేఅమ్మా"

అనంతాకాశంలోంచి రాలిపోతూన్న చుక్కల్లా, అమ్మకనులోంచి రాలిపోయే నీటిచుక్కలు నాకుసమాధానము నిచ్చేయి.

"అమ్మా! కష్టసుఖాల్ని మనం తెల్సుకోలేం—జోగి—భోగి, భోగి—జోగిగా మారడంలో ఎంతవింత — ఎంతసౌశ్చర్యం? మానవమాత్రం లేనుటే... ఆదినుంచీ బీదతనాన్ని అనుభవించేమానవులు ధనవంతులు కావడంలో వాతావరణశోభఅతీతం. కానీ సహజంగ ధనవంతుడు పేదవాడుగా పరిగణింపబడుతూవున్నాడంటే సృష్టికి సమాజానికి తీరని కళంకం.

పేదవాడు డబ్బులేక బాధపడను.

ఎందుకు?

నిత్యం—నిరంతరం—తనుపేదవాడు—ధనహీనుడు—గుణహీనుడు.

అంటారు...

అమ్మహృదయం ఎంతవిశాలం—సరళం! ఎంతసానుభూతి.

లోకంలోని స్త్రీలంతా యిట్లానే?

సుబ్బులూ ఎటువంటిపన్నాగం నీది?

ఔను! తగినశాస్తిచేశావ్.

తెల్లటిదీపశాంతుల్లో సుఖంగా తులుకుతున్నావ్. ఒకయింటి సౌభాగ్యాన్ని కూల్చి, ఆవ్యక్తిని ఎందుకూపనికిరాకుండా, జీవచ్ఛవంలా తయారుచేశావ్. నాన్నమతిచలించి తిరుగుతూవుంటే హేళనగా నవ్వుతున్నావ్—వెక్కిరిస్తోన్నావ్—ఊరిస్తోన్నావ్—మురిపిస్తోన్నావ్.

నీపాంత్యాల బలీయమైనది.

నీచేతిలోచిక్కడే మానవప్రాణి, యిక తెరుకోవడమనేమాట కల్ల. యీకల్లబొల్లిసమాజంలో నీవోక నీతికర్తవు. భూతాలివి. రాకాసివి.

నినునమ్మి. తనయావజ్జీవితాన్ని నీకుదానంచేసి కట్టుకున్నభర్త, దారుణమరంతరబాధకు ఆహుతౌతోంటే నీకడుపుకు నీవు సంతృప్తి చెబుతో, అతనిజీవితాన్ని నీపాదాలకింద నలుపుతో, వానిసర్వాన్ని దోచుకొని కాలదన్నేవు. యింకా యీవిశాలవిశ్వంలో—యీవింత భూమండలంలో, మరెవరిజీవితాన్ని కూలద్రోచేందుకు నిలచేవ్.

నీభర్తను అట్లా విరాగి—బైరాగి—బికారిచేసి, నీవు హంసతూలికా తల్పాలమీద భోగం—మహాభోగం అనుభవిస్తున్నావ్. ఒక్కసారి కళ్లు తెరువ్, నీముందు నీచమైనబ్రతుకు నిగ్రహించు, ఎంతహీనంగా—నీచంగా—దరిద్రంగా వుండేదానవ్ నీవు. మరి యీభోగమంతా ఎక్కణ్ణుంచి లభించిందినీకు.

ఒకప్పుడు నీవు—తండ్రింటిలో పూర్తిగామెక్కి, భర్తస్థితిని చూస్తూవున్నావు. అటువంటి సమయంలో అతనేమిచేశాడో నీకనుభవమేగా, గంజి—పచ్చిగంజినీరు త్రాగుతూవుంటే చూశావ్. వాని

ఆకలిమంటల్నిచూచి పకపకానవ్వేవ్—అమాయకుడైన నాన్నను వంచించేవ్—ఖూనీచేశావ్ ...

నాన్న పిచ్చివాడై వీధులంట తిరుగుతూవుంటే లోకం ఏమని చెప్పుకొంటుంది—నాజీవితమంతా చెప్పుకుంటుంది.

'న్యాయాధికారులఎదుట—సత్యం మరుగుపర్చి, తనుకన్నకొడుకుని లేడన్నాడు. అమాయకురాలైన భార్యను—పవిత్రశీలయైన ఆ సాధ్విని వెళ్ళగొట్టించేడు—ఆ పాపం—ఆదరిద్రం—కట్టికుడుపకుండా వదుల్తుందా' అనుకుంటుంది.

నాహృదయంలో భావాలు—అలలుగా పొంగుతోన్నై.

నాన్నను చూచినప్పుడల్లా—నాకన్నుల్లోనిజ్యోతి క్షీణించిపోతుంది. హృదయం బరువెక్కుతుంది—రక్తప్రవాహం సన్నగిల్లుతుంది. కొడుకునైవుండికూడా, కన్నతండ్రిని అట్లా యమకూపంలో పడనీయడం మంచిదనితోచలా.

నాన్న ఏటిగట్టునకూచొని విచారణచేస్తున్నాడు.

ఎంతలోఎంతమార్పు ప్రాప్తించింది నాబ్రతుక్కి?

నమ్మేను, తనపాదాంకితంచేశా నాజీవితాన్ని. అబ్బా, ఎంతదబ్బ గుండె తరుక్కుపోతుంది ఆవస్తుఫల్నీ సొమ్ముల్ని తల్చుకునేసరికల్లా, ఔను అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యను కాలదన్నేను, హింసించేను. చివరకు రంకుకట్టేను—న్యాయస్థానంలో, ఆబిడ్డనాకు పుట్టలేదని అబద్ధమాడేను సాక్షులకు రూపాయసంచులుయిస్తూ అబద్ధమాడించేను పాపిని—దుర్మార్గుణ్ని ...

పాపం! ఆతల్లిబిడ్డలు—ఎంతకష్టపడి యింతవరకూ జీవించుకొచ్చారో. ఈనాడు—యీదిక్కులేని పరిస్థితిల్లో నాకొడుకూ నాభార్యా అని వాళ్ళదగ్గరకెడితే ఎల్లావుంటుంది—

ఎల్లావుంటానికేముంది—లోకమంతాకలిసి తుపుక్కున ముఖం మీద ఉమ్మేస్తుంది—చీవాట్లుపెడుతుంది—స్థిరచరాస్తుల్ని రిజిష్టరీ పెళ్ళాం'

ముఖాన్ని వెలిగించి—హారతిచ్చి—చవటన్ని నిస్సహాయుణ్ణి, వీధివీధి తిరిగి ఇంతభిక్ష మనుష్యుణ్నే రోజులు సిద్ధించేయి.

భగవాన్ ...

ప్రార్థిస్తున్నాను. నాయుంచా రాలనన్నిటినీ మర్చిపొమ్మని.

బ్రతకలేను... బ్రతకలేను.

భయంకరతమోరాశి పితాంతవించే గుహసంలో, మలమలమా డుతూ కనుమూలకుల్లో కోసపారేసాలిన్ని సెబ్బుతూ ఉండే సుబ్బులూ, ఆమతంపిస్తి, యీనాటు—ఎటువంటి భోగులయ్యారూ.

భగవాన్ నమస్కార్.

ఈనాటికయినా, నాకనుల్ని—పాపల్ని కప్పుకున్న పొరల్ని. తెరల్ని తొలగించేవు, తుంచేవ్ ...

అబ్బా ఇంకా ఎంతమహత్తరశక్తి వుందో—యీమానవజీవితాల్లో, కనుకున్నబిడ్డను—నావంశచిహ్నానికి ఏళ్లు పెంచుకుంటోన్న ఆబిడ్డను తృణీకరించేను నాకసాధ్యమున్నీ.

ఒకవిధంగా సుబ్బులు—రిజిష్టరీపెళ్లాం, నాకు నీతిని—గుణపాఠాన్ని నేర్పింది. ధర్మానికి మార్గంచూపింది—భార్యాబిడ్డల పవిత్రనామాల్ని తలచుకోవడానికీ—జపించుకోవడానికీ మార్గంచూపించింది.

నన్ను నాశనంచేసి, మబ్బుపట్టి—తంద్రిణుల్లో పాతిపెట్టుకొన్న ఆనాధనంతో, ఎంతకాలముని జీవిస్తారో వాళ్ళు.

ఎంతకాలం జీవిస్తేనాకేం—

నాక్కావాల్సినవాళ్లు—

నాభార్య—నాబిడ్డ!

నాకు ప్రపంచం ఇతరత్రా అక్కర్లా—అనవసరం.

నాజీవితం చివరివరకూ—నాదివ్యాత్మరాల్ని పఠిస్తూ విరమించుతాను. యీనా విచారణా—చింతాఅర్ధంగానిది.

ఈకష్టంలో నాకు సుఖంలేదూ?

ఉంది—లేకపోలేదు.

అదే సుఖం—సంతోషం ప్రపంచం చివరిదాకా. భగవానుడితో పాటు – పవిత్రనిర్మలప్రాణులైన అభాగ్యాబిడ్డల దివ్యమూర్తుల్ని ఆరాధించడంలో ఆనందమూ—సౌఖ్యమూ లేదూ?

వెడుతున్నాను.

ఎక్కడికో వెళ్ళిపోయినాను.

నాకు శాంతీ—సౌఖ్యమూ లభ్యమయ్యేచోటికి.

ఆకాశం భూమీ కలిసేతావుకి—

స్త్రీపుట్టుక—చూపూ లేనిచోటికి—

అంతకీ శాంతి చేకూరదూ—

ప్రశాంతమైన మాతృగర్భం—

పర్వతోన్నత శిఖరాలు—తలాలు—

చల్లటి నదీమతల్లి నిండుగర్భంలో—నిండుగా శాంతిపొందుతూ తీసుకుంటూ—'

నాన్న పిచ్చివాడై, అల్లా పలుక్కుంటూ, చెట్లతోనూ—పుట్లతోనూ, వీలయినంతమట్టుకి పశువులతోనూ, కుక్కలతోనూ, సామాన్యజంతుజీవాలప్రతీదాంతోనూ, తనతాపాన్ని – ద్రోహశాస్త్రాన్ని తెప్పుకుంటూ—

సుబ్బులు వీధంట పోతూ, మేడమీద మేడలు లేచిన ఆమె భవనాన్ని తలెత్తిచూస్తూ, సానుభూతిగా సంతతధారాపాతంగా ఆ మిగిలున్న వేడిజలుబునీళ్ళను బైటకు వెళ్ళగ్రక్కుతూ, ఆయింటి ముందు శుభ్రపరుస్తున్నాడు.

అయితే నాన్నను నేనుతప్ప మరెవ్వరూ గుర్తించలేరు. నేను ఎప్పటికప్పుడే, అతని యోగ్యతల్ని ఆరోగ్యాన్ని గుర్తిస్తూ, నీబిడ్డనని తెలీకండా, ఎన్నోసహాయాలు చేస్తూనేవున్నాను. ఆకలిమంటల్ని

చల్లార్చుకునేవున్నాను. నామంచిమాటల్ని చల్లనిచూపుల్ని ఇచ్చి కొంతవరకు మనఃశ్శాంతినిస్తోనేవున్నా.

"కాని నాన్నా! నీభానుని—నీవంశానికి నిలచిన వీరుణ్ణి—నీరక్తమాంసాల్ని పంచుకొని పుట్టిన పాపాయిని—నీబిడ్డను" అని మాత్రిం చెలీనీకంలా నాకులని చాతకావని

తారామండలాన్ని తోకచుక్క ఉక్కవి చింది—నక్షత్రితో—ధృవుడితో కబుర్లు చెబుతుంది సూర్యుడి కాంతి చిన్నగా తప్పించి—అనంద పథంలోంచి ఒక్కసారి మెఱుస్తూ ఆవింతచుక్క వూడిపోయింది రాలి పోయింది—అందోవింత!

---

౮

చిన్నతనంలో అమ్మా దగ్గరవిన్నాను.

పసుపూకుంకమయొక్క విలువ.

అదే. యీనాడు నామాతృదేవతకు—నాపూజ్యనీయమూర్తికి దూరమయ్యింది. భరించేందుక్కు హృదయత శూన్యమయ్యింది.

మాయింట్లోజ్యోతి, అమ్మ పూజించుకునేజ్యోతి గుప్పున ఆరిపోయ్యింది. వారానికిముందుగా పాతిన పారిజాతం—చిన్నకృష్ణుడికనిచెప్పి, పూజించేందుకు పువ్వులకని వేసిన, అమ్మచేతులతో—నాచేతులతో వేసిన మారుతీ—పూలమొక్కలూ వాడిపోయినై, వాలిపోయినై.

అమ్మతో భావగర్భితంగా చెప్పేను—

ఎవరోసన్యాసికి—బైరాగికి నిత్యం మిఠాయీ—పప్పులూ పెడుతుంటూ—చల్లనిచూపులిస్తూ—తియ్యని ముద్దులిస్తూ శాంతిస్తున్నాను అని

ఒకనాడు అమ్మేదడిగింది.

'నాన్నా భానూ! మీనాన్న అవుపిస్తోంటారా?'

'లేదె! ఎవరో అదె చెబుతున్నాగా, బికారీ—బైరాగిలావుంటాడు
ఆయనే నాకు ఎప్పుడూ తటిస్తూవుంటాడు

ఒకరోజున అడిగేడు.

'నాబిడ్డ నీకుమల్లేనే వుంటాడు. నీకు తెల్సుంటే ఒకసారి తీసుకొచ్చి చూపెడుతావా బాబూ' అన్నాడు

దానికి నేను—

'ఐతే...మీ అబ్బాయి నాలాగ్గవుంటాడన్నావ్ గామరి. అతడే నేననుకో...''

''ఏం నాన్నా?'

'మీ అబ్బాయి నాకు తెలీదుగా తీసుకొచ్చి నీకు చూపించేందుకు'

'నిజంబాబూ! నీలాగ్గవుంటాడు—అభాగ్యుడు.''

'తనకేం—అభాగ్యుడంటున్నావ్—''

'నిజంబాబూ! తనకేం ధన్యుడు—పవిత్రుడు, నేనే ఆ దుర్భాగ్యుణ్ణి కన్నకొడుకుని చేతులారాజారవిడచుకొని, కృశించిపోతున్న పాపాత్ముణ్ణి

'మరి అతణ్ణి నన్నే అనుకోకూడదూ—'

'ముందు అల్లానే అనుకున్నా.'

''ఇప్పుడు—''

''భావిస్తోన్నా' అంటూ నన్ను చేరదీసుకొని హృదయాని కద్దుకొంటూ, ముద్దుమీద ముద్దుపెట్టుకుంటూ వుండిపొయ్యేడే అమ్మా! అదేంటోనాకు అతణ్ణిచూస్తే భయంవేసేది. కానీ అపుడు ఎందుకో ఏభయంలా, ఇంకాయింకా వారిచేతుల్లో వుండిపోవాలి అనుకున్నాను ఆయనాలంటే—మరి ఎవరో...'

నేనల్లా చెబుతూంటే అమ్మకు కొంచంకొంచంగా అర్థంచేసుకుంది. కళ్ళల్లోని వెలుగులు జిమ్మతోనైన కాంతిని, చిన్నగా స్ఫురిస్తోంది. కడలే ఆనందకళలూ—రేఖలూన్ను.

ఇంకా నాతండ్రిమీద కక్షవిడవ్లా?

ఇంకా అతడిదగ్గర ఏముందని?

వున్నదంతా దోపిడీచేసి మేడలుమీదమేడలుకట్టి కట్టుకున్న భర్తనివిక్రయించేవ్, నానాహింసలుపెట్టేవ్, వానింటోవున్నంతకాలం విషసర్పంలా విషమించినడిచేవ్.

ఏమొచ్చింది?

ఆఖరికి అతడిరక్తాన్ని కళ్ళారాచూచేవు, చూచినవరకూ విడ్చిపెట్టలాభూతం, అదుగో! యింకా నీయిష్టమొచ్చినట్టుచేయి—చేయించు. అదుగో! ఆకారుతోన్న ఆవెచ్చటి — ఎఱ్ఱటిరక్తంలో తలారాస్నానం చేయి, కడుపునిండాతాగు.

ఇంతాకన్నా నీవేమీచేయలేవ్.

ఏంచాయగలవ్—చేయించగలవ్?

ఊఁ! అల్లాచూస్తావేం?

రా! అదిగో! ఎంగుకూపనికిరాకండా పరిపాలిస్తోంది. కాల్వలై సాగుతోంది. తిలకందిద్దుకో — నీ జంతాన్ని పవిత్రంచేసుకో ఆరక్తపు ఓరులోచేరి—

అని నేను కంటనీరును తుడ్చుకోకండగనే — అల్లాగోడమధ్య— తండ్రిశవంచెంతకూర్చుంది. చెపుతూంటే, అందరూఆశ్చర్యపోయారు.

సుబ్బులు బేజారయిపోయింది.

చివరకు రిజిష్టరీపెళ్ళాం నాన్నజీవితాన్నికాదు నాన్న వేడినెత్తురిన్ని పారుతోన్న రక్తపుకండల్నిచూచి తృప్తిపడింది. తనదాహాన్ని ఆరక్తంలో చల్లార్చుకుంది.

చివరిశక్తిని వూడదీసుకుంటూ కళ్ళుతెరిచేడునాన్న.

చూచేడు "సుబ్బులూ!" అన్నాడు.

ఔను అన్నా సుబ్బులే!

అనుదినం నీ నీడను వెన్నంటి తిరుగుతోన్న మృత్యుదేవత. భయంకర భూతం—కాలసర్పం విషసర్పం అన్నారు.

నా ముఖంలోకి చూసేడు.

నాన్నా' నాన్నా!

అస్త్రం అనివిచివరిదశలో నిల్చారు. ఆనందించేను.

నాకే దేవుళ్ళు.

నాతండ్రి సముక్షింపజేసి— చివరిదశలో—నామూలంగాళ్ళ ఆనందం కలిగించేను.

'బాబూ—నీవా—దీవించు నాన్నా—'

అనే నాన్న చివరిమాటలు.

నాకూ—అమ్మకీ—ప్రపంచానికీ దూరమయేను.

అబ్బా ఎటువంటి మహా శక్తిశాలులూ లోకంలో? ఎప్పుడైనా తలంచేనా—తలంచిందాఅమ్మా?

నాన్న నాచల్లటిచేతుల్లో — మృదుహస్తాల్లో వైరాగ్యంపొందుతాడని?

'సృష్టి' అదంతా విచిత్రం, మీరుమాత్రం మోసపోకండి — చెబుతున్నా.

నాన్నకు శాంతికోసరం ఏంచాయవాలి?

'నాన్నా—నీవు ధన్యుడివి—పవిత్రుడివి— నీవ్రకనుకున్నందుకు— నీపుత్రుడిచేతిలో దివ్యత్వాన్ని అలంకరించేవు. నాకొకటి సంభవించింది

తలచేను ఒకప్పుడు.

తండ్రిఅనేవాడిమాటలూ—ముద్దులూ ఎటువంటివని.

కానీ అవి ఒకప్పుడు నీదగ్గర—నీబికారివేషంలో—వైఖరిలో చవిచూచాను—

అమ్మకు మరోమాటు ప్రార్థించింది.

నిత్యంపూజామందిరం.

నిమీలిత నేత్రాలతో—అమ్మదాపులోనేనూవుండి—ప్రార్థిస్తున్నాం నీకు శాంతి—విశ్రాంతికోసరం—భగవాన్ దయామయుడు.

నీవాలోకంలో—తగినంత మేలుతో మసలుతూవుండు.

దేవతలు—జయజయ నినాదాలు పూరిస్తారు.

దేవకన్యలు నాట్యంచేస్తూ నీకు జోహారులనిస్తారు.

చిన్నకృష్ణుడు మురళిమోగిస్తాడు.

ఆవులు పాటలు పాడతాయి——

పక్షులు గానంచేస్తాయి, శ్రావణంలో—వసంతంలో చెట్లఆకులు పిరియమవుతాయి – లోకంపొంగిపోతుంది – హృదయాలు ఆనందపరిద మము లవుతాయి.

భగవాన్‌తో నవ్వుతాను - భగవాన్‌తో ఆడుతా.

లోకాన్ని నాకలంతో వెక్కిరిస్తా—బాధిస్తా.

నమస్కార్! ఏకకవీరుడు.

'శ్రీయాజ'

సమాప్తి.

శ్రీరామా ప్రెస్, రాజమండ్రి.